# ఆంధ్రపత్రిక

316492

The Andhra Patrika, Madras. } Regd No. 1118. Vol. 33 FRIDAY 12th July 1946 No. 88 వెల ఒకఅణా { Founder: K.Nageswara Rao.



# రాజ్యాంగపరిషత్తును బహిష్కరించడానికి సిక్కుల నిర్ణయము

## దక్షిణాఫ్రికా భారతీయుల సత్యాగ్రహం

### ప్రాక్పశ్చిమ నాగరికతల సంఘర్షణ యని గాంధి మహాత్ముని వ్యాఖ్య

పూనా, జులై 10: "పాశ్చాత్య నాగరికత దక్షిణాఫ్రికాలో తన గొయ్యిని తానే తవ్వుకొంటున్నది." అని గాంధీజీ నేడు సాయంకాలం ప్రార్థనసభలో ద. ఆఫ్రికా పరిస్థితులనుగురించి మాట్లాడుతూ చెప్పారు. ఆసియా నాగరికత ముందు దక్షిణాఫ్రికాలోని "శ్వేత నాగరికత" నల్లగానే కన్పిస్తున్నదన్నారు. దక్షిణాఫ్రికా భారతీయులు అఖిరివరకూ, దీక్షతో, దౌర్జన్యరహితమైన సాత్వికనిరోధాన్ని సాగిస్తే, ప్రస్తుతం అసలు రంగుల్లో బయటపడుతున్న శ్వేతజాతుల నాగరికత అంతరించిపోతుందన్నారు. తనదేశంలోని భారతీయుల హింసించడం సాధ్యం గాదని గ్రహించి స్మట్సు, మర్యాదగా భారతీయులతో రాజీ పడతాడనే ఇంకా తాను ఆశిస్తున్నానని గాంధిజీ చెప్పాడు.

గాంధిజీ ఇంకా ఇలా కూడా చెప్పాడు:

"దక్షిణాఫ్రికాలోని తెల్లవారు చాలా అమానుషంగా ప్రవర్తిస్తున్నారు. అక్కడ ప్రాచ్య పాశ్చాత్య నాగరికతలకు సంఘర్షణ జరుగుతూ ఉంది. ఆ రెంటికి ఎంత విపరీతమైన తేడా ఉన్నదీ తెలుస్తున్నది. మురికికూపాలలో భారతీయులను నిరసింపచేయడానికి దారుణమైన శాసనాలు చేసారు. ఫీల్డుమార్షల్ స్మట్స్ గొప్ప తత్వవేత్త. నన్ను ఆయన తన స్నేహితుణ్ణిగా భావిస్తున్నామన్నారు. ఆసియా నాగరికతఅంటే తనకేమీ ఆక్షేపణలేదన్నారు. కాని శ్వేత నాగరికతను రక్షించడానికి అక్రమమైన శాసనాలను ఆయన చేయవలసివచ్చింది. రంగుజాతులవారిని నీచంగా చూడవనని స్మట్స్ అన్నాడు. సుబ్బరాయన్ సతి చదువుకోడానికి ఇంగ్లండ్ వెళ్లినప్పుడు ఆమె స్మట్స్ ఇంట్లోనేవుంది. పై ప్రకటనను ఈవిషయం బలపరుస్తున్నది. ఆసియా నాగరికతపై ఎలాంటి దురభిమానమూ లేకపోయినా తాను దక్షిణాఫ్రికాలో శ్వేతనాగరికతను రక్షించవలసిఉన్నదనీ, సరసులైనవారు తన చర్యల నర్థంచేసుకోగలరని అన్నాడు. కాని నేను అర్థంచేసుకోలేకపోతున్నాను. సంస్కృతి, నాగరికతల రక్షణకు శాసనాలు కావాలా?

"దక్షిణాఫ్రికా భారతీయులు సాత్విక మార్గాన ఈ శాసనాలను ఉల్లంఘించుచున్నారు. అదే నాగరికత పద్ధతి. కాని యూరపియన్లు తమ శాసనాలను తామే ధిక్కరించి, భారతీయులపై దౌర్జన్యం చేస్తున్నారు. దక్షిణాఫ్రికాలోని భారతీయులు చాలామంది హరిజనులు. వీరింత అద్భుతంగా సాత్విక నిరోధోద్యమాన్ని

2 వ పేజి చూడుడు

### గాంధీజీ - అంబేద్కర్

#### సమావేశపరచడానికి ప్రయత్నములు

న్యూఢిల్లీ, జులయి 10: త్వరలో గాంధి అంబేద్కర్ సమావేశము జరుగగలదని బొంబయినుంచివచ్చిన వార్తలవల్ల తెలుస్తున్నది. రెండేళ్ల క్రితం గాంధిజీ బొంబయిలో జిన్నాగారిని కలుసుకొన్నప్పుడు అంబేద్కర్ గాంధిజీకి ఒకజాబు వ్రాశాడు. గాంధిజీకి సమ్మతిమైతే షెడ్యూల్డ్ తరగతుల సమస్యల చర్చించడానికి తాను వస్తానని అంబేద్కర్‌గారు ఆలేఖలో తెలియజేశారు. దాన్ని పురస్కరించుకొని ఇప్పుడు ఇద్దరికీ కావలసిన మిత్రులు కొందరు ఈ సమావేశాన్ని ఏర్పాటుచేయడానికి ప్రయత్నిస్తున్నారని తెలుస్తున్నది.

ప్రజాపరిషత్తుకు బెంగాల్‌నుండి అంబేద్కర్ ఎన్నికకాగల అవకాశాలున్నాయనికూడా తెలుస్తున్నది. స్వ. వి.

### సోషలిస్టులు - కాంగ్రెసు కార్యవర్గము

బొంబాయి, జులై 10: శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ తన సంప్రార్థనను మోషంలోనే కాంగ్రెసు కార్యవర్గంలో చేరిందని, కాంగ్రెసు సోషలిస్టు నాయకుడైన శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ప్రకటించాడు. సోషలిస్టు సభ్యులు కాంగ్రెస్ కార్యవర్గంలో చేరకూడదని ఎన్నడూ తాము నిషేధించి యుండలేదని చెప్పి, పాత కార్యవర్గంలో కాంగ్రెసు సోషలిస్టు అయిన ఆచార్య నరేంద్రదేవ్ సభ్యుడుగా ఉండేవాడని దానికి నిదర్శనంగా ఉదహరించాడు.

### యు. పి. కి మరో ముగ్గురు మంత్రులు

లక్నో, జులై 10: యు. పి. మంత్రివర్గ సభ్యుల సంఖ్య త్వరలోనే పెంచబడుతుందని విశ్వసనీయవర్గాల ద్వారా తెలుస్తున్నది.

ప్రస్తుతం పంతు ప్రభుత్వములో 6 గురు మంత్రులు ఉన్నారు; అదనంగా ఇంకో ముగ్గురు మంత్రులను, ముగ్గురు పార్లమెంటరీ సెక్రటరీలను వేసుకుంటారని అనుకుంటున్నారు. యు. పి. ఐ.

### శ్రీమతి సరోజినీదేవి అస్వస్థత

బొంబాయి, జులై 10: శ్రీమతి సరోజినీదేవికి నడుదురుమీద కురుపులేచి జ్వరం వస్తున్నది; వారం రోజులపాటు పూర్తిగా విశ్రమించ నిర్ణయించుకున్నది.



## పంథీ ప్రతినిధి సంఘ తీర్మాన ఫలితం

### మంత్రిత్రయ పథకంలో తమకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించే సంకల్పం

లాహోరు, జులై 10: సిక్కు పంథీబోర్డు సభ్యులు, కాంగ్రెసు సిక్కు శాసనసభ్యులు, జాతీయ సిక్కు నాయకులు ఈ రాత్రి సమావేశమై దీర్ఘ సమాలోచనలు జరిపి, భారత రాజ్యాంగ పరిషత్తును పూర్తిగా బహిష్కరించడానికి, సిక్కు ప్రతినిధులు నెవరినీ రాజ్యాంగ పరిషత్తుకు పంపకుండా వుండడానికీ తీర్మానించారు.

సిక్కు పంథీబోర్డు అధ్యక్షుడు కర్నల్ నిరంజన్‌సింగు జిల్ పత్రికా విలేఖరులకు ఈ నిర్ణయాన్ని తెలియజేస్తూ పంజాబు శాసనసభలోని పంథీపార్టీ నాయకుడు సర్దార్ బలదేవ్‌సింగ్, కాంగ్రెసు శాసన సభ్యుల నాయకుడు సర్దార్ ప్రతాపసింగ్ (కాంగ్రెసు కార్యవర్గ కొత్త సభ్యుడు) గారలు రాజ్యాంగ పరిషత్తులో అభ్యర్థిత్వాన్ని తాము అభ్యర్థిత్వాన్ని కోరబోవడం లేదని హామీ ఇచ్చినట్లు కూడా ప్రకటించాడు. రాజ్యాంగ పరిషత్తును బహిష్కరించేవిషయంలో అందరూ ఏకగ్రీవంగా ఒక నిర్ణయానికి వచ్చినట్లుకూడా జిల్ తెలియజేస్తున్నాడు.

అకాలీదళ నాయకుడు మాస్టర్ తారాసింగ్, ఇంకా ఏడుగురు సిక్కు శాసన సభ్యులు, వివిధ వర్గాలకు చెందిన సిక్కు నాయకులు, ఆజాద్ హింద్ ఫౌజు ప్రథమ దళానికి చెందిన జనరల్ మోహన్‌సింగ్ మొదలైన వారందరూ ప్రత్యేక ఆహ్వానాలపై సమావేశానికి హాజరైనారు. 20 మంది పంథీ ఎం. ఎల్. ఏ. లు కూడా వచ్చారు.

రాజ్యాంగ పరిషత్తును పూర్తిగా బహిష్కరించడానికీ, బ్రిటిషు మంత్రిత్రయ పథకంవల్ల సిక్కులకు కలిగిన అన్యాయాన్ని ప్రతిఘటించడానికీ తీర్మానించారు.

అమృతసర్‌లో పాంథిక్ కాంగ్రెసు వారు గత మాసంలో ఏర్పాటు చేసిన కార్యకారిణీ సంఘం యాజమాన్యంకింద మాత్రమే 'మోర్చా' ఉద్యమం (సత్యాగ్రహం) సాగుతుందనీ, వ్యక్తిగతంగా ఎవరూ దాన్ని సాగించడానికి అధికారం లేదనీ కూడా జిల్ వివరిస్తున్నాడు.

"మేము బ్రిటిషువారిపై ఎట్టి ప్రతిఘటనోద్యమాన్ని సాగించినప్పటికీ, అది కాంగ్రెసుకు సహాయకారి కాగలదు; పద్ధతులు వేరైనప్పటికీ కాంగ్రెస్ లక్ష్యము, మా లక్ష్యమూ ఒకటే." అని జిల్ అభిప్రాయపడుతున్నాడు. "సిక్కుజాతివారు కాంగ్రెస్‌కు ప్రతికూలంగా వున్నారని భారతీయు లెవరూ భావించకూడదు."

### నెహ్రూ హితబోధ

#### ప్రతినిధులను ఎన్నుకోవలసిందని సలహా

లాహోరు, జులై 10: రాజ్యాంగపరిషత్తును తాము బహిష్కరిస్తున్నట్లు ప్రతినిధి పాంథిక్ బోర్డువారు తీర్మానాన్ని చేయగానే, ఆ నిర్ణయాన్ని పునరాలోచన చేయవలసిందని కోరుతూ రాష్ట్రపతి నెహ్రూ, సర్దార్ నిరంజన్‌సింగ్ జిల్‌కు, సర్దార్ ప్రతాపసింగ్‌కు, అత్యవసర వర్తమానాన్ని అందచేసినట్లు తెలుస్తున్నది.

సర్దార్ ప్రతాపసింగ్‌కు పండిట్ నెహ్రూ పంపిన ఈ క్రింది సందేశ పాఠాన్ని పంజాబు కాంగ్రెస్ నాయకుడు భీమసేన సచార్‌గారు విడుదల చేస్తున్నారు:

"రాజ్యాంగ పరిషత్తులో సిక్కులు పాల్గొన బోవడంలేదని తెలుస్తున్నది. ఈ నిర్ణయం అనేక ప్రధాన ఫలితాలకు దారితీస్తుంది. కాబట్టి, దీన్ని పునరాలోచన చేయవలసిందని హృదయ పూర్వకంగా

(2-వ పేజిచూడుడు)

## 'రాజ్యాంగపరిషత్తు ఏర్పడితే స్వాతంత్ర్యం వచ్చినట్లు కాదు'

### అవసరమైతే మరొక పోరాటానికి ప్రజలు సంసిద్ధంకావాలని రాష్ట్రపతి హెచ్చరిక

బొంబయి, జులై 10: "కాంగ్రెస్ రాజ్యాంగ పరిషత్తులో పాల్గొన నిశ్చయించిందంటే, భారతీయులకు స్వాతంత్ర్య నవ్యాశయోదయం అయిందని కానీ, సర్వస్వతంత్రాధికారాలు లభించాయని గానీ ఎంచరాదు." అని రాష్ట్రపతి జవాహర్లాల్ నెహ్రూ నేటి సాయంత్రం శివాజీ పార్కులో లక్షమంది ప్రజలు సమావేశమైన బ్రహ్మాండమైన సభలో ఉపన్యసిస్తూ అన్నాడు.

"కాంగ్రెసు రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనడంవల్ల స్వాతంత్ర్య సంపాదనార్థమైన జాతీయపోరాటం ముగిసిందని ప్రజలు భ్రమపడరాదని రాష్ట్రపతి నెహ్రూ హెచ్చరించాడు.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కాలవాలమయే భారతదేశానికి ఒక రాజ్యాంగాన్ని నిర్మించడానికి రాజ్యాంగ పరిషత్తు ఎంతవరకు తోడ్పడుతుందో ప్రయత్నించి చూదామని కాంగ్రెస్ నిశ్చయించింది. ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొనే, కాంగ్రెస్ రాజ్యాంగ పరిషత్తుకు తన ప్రతినిధులను పంపుతుంది. ప్రజాస్వామ్యమూ, ప్రజలకు సర్వస్వతంత్రాధికారాలూ ప్రాతిపదికగా స్వతంత్ర భారతదేశానికి ఒక రాజ్యాంగాన్ని నిర్మించడమే ఆ ప్రయోజనం. అయితే, రాజ్యాంగపరిషత్తు ఏర్పాటు భారత స్వాతంత్ర్యానికి దారితీస్తుందనుకోరాదు.

బ్రిటిషువారినుంచి స్వాతంత్ర్యం ఊడబెరుక్కునేందుకు పోరాటం ప్రారంభించవలసివచ్చేటట్లయితే, ప్రజలు తుపాకి గుండ్లనూ; సన్నీలనూ ఎదుర్కొనడానికి సంసిద్ధులై ఉండాలి. మనకు అప్పుడే స్వాతంత్ర్యం వచ్చేసిందన్న దృక్పథంతో ప్రజలలో దేపర్యాప్తతనమూ, మందకొడితనమూ వ్యాపించరాదు. రాజ్యాంగపరిషత్తు స్వాతంత్ర్య సంపాదనకు తోడ్పడలేకపోయిన పక్షంలో, పోరాటం తప్ప గత్యంతరం లేని సందర్భంలో అందుకు మనం సంసిద్ధము కావాలి కనక ప్రజలు ఐకమత్యాన్ని, శక్తినీ పెంపొందించుకోవలసి వున్నది.

అది అట్లావుండగా, మన దేశ పరిపాలనాయంత్రాన్ని మన చేతుల్లోకి తీసుకొని ప్రభుత్వం నిర్వహించడానికి కూడా మనం సంసిద్ధులం కావాలి. కనక ఈ రెండింటికీ అంటే స్వాతంత్ర్యంకోసం పోరాటం జరపడానికీ, స్వతంత్రభారతదేశ పరిపాలనాభారాన్ని నిర్వహించడానికీ మనం సంసిద్ధులం కావాలి అని రాష్ట్రపతి జవాహర్లాల్ నెహ్రూ అన్నాడు.

దక్షిణాఫ్రికాలో భారతీయుల సాత్విక నిరోధంవిషయమై రాష్ట్రపతి ఇల్లా అన్నాడు:

ప్రపంచంలో ఏప్రాంతంలోనైనా సరే ఇట్లాంటి అమానుష అనాగరక జాతివివక్షత కొనసాగుతూండేటట్లయితే, అనతి కాలంలోనే తెల్లవాళ్ళకూ, నల్లవాళ్లకూ ప్రపంచ వివ్యాప్తసంఘర్షణ సంభవించక తప్పదు.

### విశ్రాంతికోసం డెహ్రాడూన్‌కు

#### మౌలానా ఆజాద్ ప్రయాణం

లక్నో, జులై 10: కాంగ్రెసు పూర్వాధ్యక్షులైన మౌలానా అబుల్‌కలాం ఆజాదుగారు నెలా పదిహేనురోజులపాటు పూర్తిగా విశ్రమించడానికి డెహ్రాడూన్ వెళ్లుతున్నాడని విశ్వసనీయమైన వార్తవచ్చింది. మౌలానా ఆజాద్‌గారు డెహ్రాడూన్‌కు జులై మధ్యలో వెళ్లవచ్చును. అవసరమైన ఏర్పాట్లన్నీ ముందుగాచేసి ఉంచడానికి మహాబీర్ త్యాగి నేటిరాత్రి డెహ్రాడూన్ బయలుదేరుతున్నాడు.

డా॥ బి. సి. రాయ్ మౌలానా ఆజాద్ గారిని పరీక్షచేసి కొన్నాళ్లపాటు ఏదైన ప్రశాంతమైన ప్రదేశంలో విశ్రాంతి తీసుకోవలసిందని ఇటీవలనే సలహా ఇచ్చాడు.

## బొంబయి, ఢిల్లీలలో తపాలా పనివారల సమ్మె ప్రారంభం

### జాబుల రహాణాకు తపాలాశాఖ ఏర్పాట్లు

బొంబాయి, జులై 11. జులై 10వ తేదీ రాత్రి 12 గంటలకు బొంబాయి తపాలా పనివారు సమ్మె ప్రారంభించారు. కాని, రోడ్లపక్కన ఉండే తపాలా పెట్టెలు తెరిచి ఉత్తరాలు పోసుచెయ్యడం. మామూలుగా తెల్లవారుజామున 4 గంటలకు ప్రారంభించే పని కాబట్టి, సమ్మెవల్ల యథార్థంగా పని ఆగిపోవడం అనేది అంతవరకు ఆరంభం కాదు.

తపాలా అధికారులు ఉత్తరాల బట్వాడాకు వీలైనన్నిచోట్ల కార్యాలయాలు ఏర్పాటుచేశారు. ప్రతివారూ ఈ కార్యాలయాలకు వెళ్లి తాను ఫలానా అని గుర్తు చెప్పి ఎవరికివచ్చిన ఉత్తరాలు వారుతీసుకుపోవచ్చును.

తంతివార్తల నందించే జవానులుకూడా ముందు తపాలా పనివారితోపాటే సమ్మె చేయదలచారు, కాని, కొన్నిరోజులపాటు పరిస్థితులు గమనించి జులై 14 వ తేదీన సమ్మెకట్టాలనిమళ్లీ నిర్ణయంమార్చుకున్నారు. తపాలా పనివారల వివాద పరిష్కరించడానికి ప్రయత్నము ఇప్పుడే ఆరంభమైంది. అ. భా. తపాలాశాఖ, ఆర్. యస్. యస్. శాఖల నిమ్నోద్యోగుల సంఘానికి కార్యదర్శి అయిన వి. జి. దాల్వీగారు బొంబాయి ప్రధాని బి. జి. ఖేర్‌తో సంప్రతించడానికి రేపు ప్రొద్దున పూనా బయలుదేరుతున్నారు. తంతి పనివారల సంఘానికి అధ్యక్షులైన యస్. గెన్. జబ్వాలాగారు నూతన దాల్వీగారి వెంట పూనా వస్తారు.

ఇవాళ మధ్యాహ్నానికల్లా సమ్మెదార్ల సంఖ్య 1000 కి పెరగవచ్చును.

పంజాబు, సరిహద్దు రాష్ట్రాల తపాల యూనియన్‌కు, తాత్కాలికాధ్యక్షులైన సూరజ్ ప్రకాశ్ ఆనంద నిన్నరాత్రి జరిగిన బహిరంగ సమావేశంలో ఉపన్యసిస్తూ, సమ్మెదార్లు శాంతియుతంగా ప్రవర్తించాలనీ, అడిగిన కోరికలను నెరవేరేవరకూ సమ్మె కొనసాగించాలనీ, తపాలా పనివారిని ప్రోత్సహించాడు.

### అహమ్మదాబాద్‌లో

అహమ్మదాబాదు, జులై 11: దాదాపు 200 మంది పోస్టల్ ఉద్యోగులు నేటినుంచీ సమ్మె ప్రారంభించారు.

సూరత్‌లో కూడా తపాలా ఉద్యోగులు సమ్మె సాగిస్తున్నారు.

### ఢిల్లీ తపాలా పనివారలు

న్యూఢిల్లీ, జులై 11: ఢిల్లీలో తపాల పనివారిసమ్మె జులై 10 వ తేదీ రాత్రి సరిగా 12 గంటలకు ప్రారంభమైంది. మొట్టమొదట సమ్మెకట్టింది, 35 మంది రైల్వేమెయిల్ సర్వీసు పనివారు; ఓరు రాత్రిపనికి రాకుండా హాజరైనారు.

## ముస్లింలీగు తన ఆమోదాన్ని ఉపసంహరించే సూచన

### రాజ్యాంగపరిషత్తు సర్వస్వతంత్రమై పనిచేయడానికి వీల్లేదని నవాబ్జాదా వాదన

న్యూఢిల్లీ, జులై 10: బ్రిటిష్ మంత్రిత్రయం చేసిన భారత రాజ్యాంగ ప్రతిపాదనకు ముస్లింలీగు ఇదివరలో ఆమోదించివున్నది. ప్రస్తుతం ఏర్పడిన కొత్త పరిస్థితులలో ముస్లింలీగువారు తమ అంగీకారాన్ని బహుశా ఉపసంహరించుకుంటారేమోననే సూచన లీగ్ అధికారవర్గంలో ప్రముఖుడైన నవాబ్జాదా లియాఖత్ ఆలీఖాన్ ప్రసంగ ధోరణిలో ద్యోతకమవుతున్నదని అమెరికన్ అసోసియేటెడ్‌ప్రెస్ ప్రత్యేక విలేఖరి వాల్టర్ మాసన్ వ్రాస్తున్నాడు. వాల్టర్ మాసన్ లియాఖత్ ఆలీని ప్రత్యేక ఇంటర్వ్యూలో కలుసుకొని మాటలాడాడు.

ప్రస్తుత పరిస్థితులలో ముస్లింలీగు రాజ్యాంగపరిషత్తులో చేరడం ఆత్మహత్యసదృశమవుతుందని నవాబ్జాదా లియాఖత్ ఆలీ అభిప్రాయపడుతున్నాడు.

ముస్లింలీగు కౌన్సిలు జులై 28, 29 తేదీలలో బొంబాయిలో సమావేశమైనప్పుడు ఏవిధమైన కార్యాచరణకు పూనుకునేదీ నవాబ్జాదా జోస్యం చెప్పడానికి నిరాకరించాడు. నవాబ్జాదా వెలిబుచ్చిన భావాలు ఇవి:

తమ ప్రాముఖ్యం ఫలప్రదం కావాలని మంత్రిత్రయం ఆశించినట్లైతే; ఆ ఆశను తానే మరి దాన్ని భగ్నంచేసింది. బ్రిటిషువారు ముస్లింలీగుకు ఇచ్చిన మాటను నిలుపుకోలేక పోయినారు. ఇది ఇలా ఉంటే గా కాంగ్రెస్ రాజ్యాంగ పథకాన్ని కొన్ని షరతులపై మాత్రమే ఆమోదించింది. వాస్తవానికి కాంగ్రెసు వారు దేన్నీ ఆమోదించలేదు."

మొన్న జరిగిన ఏ. ఐ. సి. సి. సమావేశంలో కాంగ్రెసు నాయకులు, రాష్ట్రపతి యథేచ్ఛగా ముందుగానే ఒక నిర్ణయానికి రావచ్చుననే అభిప్రాయాన్ని ప్రకటించారు. మంత్రిత్రయం తమ పథకంలో ఇందుకు కొంత కాలపరిమితిని నిర్ణయించివున్నారు.

కాంగ్రెసు వైఖరిని బట్టి చూస్తే రాజ్యాంగపరిషత్తును సర్వస్వతంత్ర సంఘంగా చేసే ఉద్దేశమున్నట్లు కనిపిస్తున్నదనీ, అలా జరిగేపక్షంలో ముస్లింలీగుకు అందులో స్థానంలేదనీ, అథవా చేరినట్లయితే, ప్రతి ఒక్క లీగ్ సభ్యుడికి నల్గురు ప్రతికూలురు తయారవుతారనీ నవాబ్జాదా లియాఖత్ ఆలీ అభిప్రాయపడుతున్నాడు.

లియాఖత్ ఆలీఖాన్ ఇంకా ఇలా కూడా తెలియజేస్తున్నాడు:

"పరిస్థితి స్పష్టపడితేనే తప్ప, ఇట్టి రాజ్యాంగపరిషత్తులో ముస్లింలీగు చేరడం ఆత్మహత్య చేసుకోవడమే కాగలదు." ముస్లింలీగు చేరకపోయినప్పటికీ రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటుచేయడానికే నిర్ణయించినట్లయితే ఏమి జరుగుతుందని ప్రశ్నించగా నవాబ్జాదా లియాఖత్ ఆలీఖాన్ గారు ఇలా అన్నారు: "అప్పుడు, అధికారాన్ని శాంతియుతంగా బదిలీచేయడం జరగదన్నమాట. అమాత్రం చెప్పగలను. ముసల్మానులు చేతులు ముడుచుకొని అందుకు సమ్మతించరు."

ముస్లింలీగు ఆమోదాన్ని ఉపసంహరించేపక్షంలో జరగవలసినపని ఒక్కటే నని నవాబ్జాదా అభిప్రాయం. ప్రత్యేక ముస్లింరాజ్యస్థాపనకు దేశాన్ని విభజించడమే ఆపని అని లియాఖత్ అంటున్నాడు.

"మొదటినుంచీ త్రికరణశుద్ధిగా వుండడమే మేము చేసిన తప్పు. బ్రిటిష్‌వారి మాటలపై మాకు వున్న నమ్మకం సడలిపోయింది. బ్రిటిష్‌వారిమాటలలో ఏది ఎంతవరకు నిజమైందీ మేము ఇక చెప్పలేము."

"రాజ్యాంగ పరిషత్తు సర్వస్వతంత్రాధికారాలతో వుంటుందని మంత్రిత్రయం ప్రకటించివున్నట్లయితే, మేము అసలు ఒప్పుకొనేవుండేవాళ్ళము కాము. మా రాష్ట్రాలకు, హిందూరాష్ట్రాలకు విడివిడిగా ప్రత్యేక రాజ్యాంగ పరిషత్తులు కావాలని కోరేవాళ్ళం," అని నవాబ్జాదా విమర్శిస్తున్నాడు.

## గంటల పంచాంగం

వ్యయ సం॥ ఆషాఢ శు॥ త్రయో॥
1946 సం॥ జూలై 12 శుక్రవారం
త్రయో॥ ప 11-6 జ్యే ఈ 6 43 వర్జ్యం ప 3 37 ల 5 24 కు.
శు॥ చతుర్దశి జూలై 13 శనివారం
చతుర్దశి ప 1 10 మూ ప 9-26 వర్జ్యం ఈ 7 38 ల 9-25 కు.

# ఆంధ్రపత్రిక

వ్యయ సం॥ ఆషాఢ శు॥ త్రయో॥
శుక్రవారము

## ప్రజా పరిషత్తు భవిష్యత్తు

మొన్నటి అ. భా. కాంగ్రెసు సంఘమున, అధ్యక్షుడు పండిత జవహరలాలు తన అంత్యోపన్యాసములో ఈ విధముగ తెలిపెను. "కాంగ్రెసు ఈ పథకమును గాని, ఆ పథకమును గాని అంగీకరించినదనుట తప్పు. స్వతంత్ర భారత దేశమునకు రాజ్యాంగనిర్మాణము చేయు ఉద్దేశముతో కాంగ్రెసు పరిషత్తునందు పాల్గొన బోవుచున్నది. ఇంతకు మించిన ఒప్పందము లేదు. పరిషత్తునందు పాల్గొనే సమయములో, కనుక అనుకొన్నది సాధ్యము కాదని తోచిన యెడల దానిని వదలివచ్చుటకు అభ్యంతర మనేది ఉండదు."

ఈ భావన తాత్పర్యమును బుధవారము జరిగిన పత్రికావిలేఖరుల సమావేశములో పండిత నెహ్రూ ఇంకనూ విస్పష్టముగా విపులీకరించి చెప్పెను. స్థాయి సంఘ సమావేశములో నెహ్రూగారు చెప్పినది నిజమునకు కొత్త అంశ మేమాత్రముకాదు. అది జూన్ 26 న కాంగ్రెసు కార్యవర్గమున చేసిన తీర్మానములోనే యున్నది. "రాష్ట్రములకు సాధ్యమైనంత స్వాతంత్ర్యముండి, కేంద్రాధికారముతో కూడిన అవిభాజ్యమైన ప్రజాప్రభుత్వ సిద్ధాంతబద్ధమైన భారత ఫెడరేషను స్థాపించుటే, కాంగ్రెసు ఆశించుచున్న స్వాతంత్ర్యము యొక్క పరమార్థి" అని, ఆ సిద్ధాంతము ప్రకారము, బ్రిటిషు ప్రతిపాదనలు, సమ్యముగా లేకపోయినప్పటికీ, 'కేంద్రాధికారమును బలపరచుటకు, వర్గీకరణ విషయములో ఏ రాష్ట్రమైనా తన ఇష్టప్రకారము వ్యవహరించటానికి పథకంమొత్తం మీద అవకాశమున్నదని" అందువల్ల "ప్రజాసిద్ధాంతములతో కూడిన అవిభాజ్య భారతదేశమునకు రాజ్యాంగమును నిర్మించే ఉద్దేశముతో కాంగ్రెసు రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనవలెనని నిర్ణయించుచున్నాము" అని కార్యవర్గ తీర్మానము తెలిపినది. అయితే నెహ్రూగారు చెప్పినట్లు "అనుకొన్నది సాధ్యముకాదని" తోచిన పుడు, పరిషత్తును వదలి రావలసి యున్నది అని తీర్మానము తెలుపలేదు, కాని దానిలో ఆ అర్థము ఇమిడియే యున్నదని నెహ్రూగారు దాని నిపుడు విపులీకరించి బహిరంగముగా తెలిసిరి. రాజ్యాంగపరిషత్తులోకి వెళ్లుట తప్ప మరేమీ కాంగ్రెసు అంగీకరించలేదు. తరువాత ఏమి కానున్నదో ఇపుడు చెప్పుటకు వీలులేదని నెహ్రూగారి తాత్పర్యమై యున్నది. భవిష్యత్ కార్యక్రమ నిర్ణయమును గురించి తీర్మానములో చెప్పకూడదని కార్యవర్గము తలచియుండవచ్చును.

అయినప్పటికీ నెహ్రూగారు ఒక సంగతిని తెలుపుచున్నారు "ఏవిషయమునూ ఒప్పుకొనుట అనేది జరుగకపోయినను, కొన్ని కారణాలవల్ల అంగీకరించవలసి యుంటుంది." అనిరి. పరిషత్తులో పాల్గొన నిర్ణయానికి అదే కారణము కావచ్చును. అయితే "పరిషత్తు భగ్నముకాకుండ చూచుటకు," తమ "ఆశయప్రకారము అది జయప్రద మగుటకు" ఎలా సాధ్యమగు నన్నది నెహ్రూగారు చెప్పలేదు. "కొన్నిటిని అంగీకరించక తప్పదు." అన్న పరిస్థితిని బ్రిటిషువారుకల్పించకపోవచ్చును. కాని ఇతరులు కల్పించవచ్చును. అపుడేమి చేయనున్నారు అన్నదే అసలు సమస్య. శ్రీ నెహ్రూగారు ఊహించిన స్థితి పరిషత్తులో గాక, ముందే ఏర్పడిన దానిని దాటుటకు ఏమి చేయనున్నారో చూడవలసి యున్నది.

అసలు ఆ స్థితి ఇదివరకే ఏర్పడినదేమో? ఒకవేళ ఏర్పడక పోయిన నెహ్రూగారు పత్రికా సమావేశములో చేసిన వివరణ వల్ల అది ఏర్పడినదనే చెప్పవచ్చును. "కాంగ్రెసు ఏది నిర్ణయించినా ఒక నూతన పరిస్థితిని కల్పించుటకు చేయును. అలాంటిది సృష్టించామని ముస్లిము లీగు గ్రహించినందుకు నేను సంతసించుచున్నాను." తాత్కాలిక ప్రభుత్వ స్థాపన వాయిదా పడుట వల్ల, యూరోపియనులు పరిషత్తు ఎన్నికలలో పాల్గొన విరమించుట వల్ల, పరిషత్తుయొక్క సర్వస్వతంత్రతను గురించి మే 25 న అమాత్యత్రయము చేసిన ప్రకటనలో తెలియజెప్పినదీ, వర్గీకరణ గురించి కాంగ్రెసు అర్థము సవ్యమైనదనే విశ్వాసము, నెహ్రూగారీవిధముగ చెప్పుటకు కారణమని వ్యక్త మగుచున్నది. మే 24 న మే 16 ప్రకటనకు కాంగ్రెసు చేసిన వ్యాఖ్యానమునకు అమాత్యత్రయ జవాబు తృప్తికరమైనదా అన్నది ఇంకనూ సందేహమనే చెప్పవలసియున్నది. మైనారిటీ రక్షణల విషయమున బ్రిటిషు వారు కలుగచేసికొనే అధికారమును తాము అంగీకరించలేదని చెప్పినంతమాత్రమున తీరిపోయినదా? మైనారిటీల సందరిసీ తామే ఇక్కడ సంతృప్తిపరచిన పార్లమెంటు దానిని ఆమోదించక తప్పదనివారియభిప్రాయమైయుండవచ్చును. పరిషత్తు అభ్యర్థుల నియామకములో మైనారిటీలకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చుటలో అదే ఉద్దేశమై యుండవచ్చును. లీగుకు క్లిష్టస్థితినికలిగించితిమనినెహ్రూగారను కొనవచ్చును. లీగుకు ఒకవిధంగా పీటమిఅని లూయిస్ ఫిషర్ గారన వచ్చును. కాని లీగుకూడ క్లిష్ట పరిస్థితిని కలిపించనున్నది. కాంగ్రెసు నిర్ణయ సూత్రమును గ్రహించినది 16 మే ప్రకటనకు కాంగ్రెసు తీసిన అర్థము సవ్యమైనదనీ, పాకిస్థాన్ బీజములు లేవని అనుకొనినారేమో? పరిషత్తులో పాల్గొనకూడదని నిర్ణయించ ఉద్దేశించినట్లు లియాకతాలీఖాన్‌గారు చెప్పుచున్నారు. సిక్కులు అసలు అభ్యర్థులనే నియమించకూడదని పాంథిక్ బోర్డు నిశ్చయించినది. నిర్ణయమును పునరాలోచించవలసినదని నెహ్రూగారు వారికి తంతినంపిరి. కాబట్టి దీనివల్ల కొత్తపరిస్థితి ఏర్పడవచ్చును పరిషత్తులో ఏర్పడనున్న ప్రతిస్పంధన బయటనే ఏర్పడనున్నది. సిక్కు, లీగు ప్రతినిధులు పాల్గొనకపోయినా బ్రిటిషు ప్రభుత్వము పరిషత్తును సాగించునా, లేక దానిని ముందుగనే భూస్థాపితముచేయునా? ఈ పరిస్థితిలో బ్రిటను ఖచ్చితమగు నిర్ణయమును చేయవలసియున్నది. అపజయమును పొందిన లీగు కోలుకొనుటకు పథక ఆచరణను విరమింపజాలదు.

## సిక్కుల నిర్ణయం

1 వ పేజీ తరువాయి

కోరుచున్నాను. మంచి ప్రతినిధులను ఎనుకున్నట్లయితే, రాజ్యాంగ పరిషత్తుకు హాజరు కావడమూ, బహిష్కరించడమూ అనే విషయాన్ని తర్వాత తేల్చుకోడానికి వీలుంటుంది. భవిష్యద్విధానం వివిధంగా వున్నప్పటికీ రాజ్యాంగ పరిషత్తుకు కాంగ్రెసు సిక్కు సభ్యులు ప్రతినిధులను ఎన్నుకోవడం మంచిదనీ నా సూచన. ఇలా చేయని పక్షంలో, కాంగ్రెస్ విధానం కాంగ్రెస్ కార్యక్రమం సంఘర్షణను ఎదుర్కొనవలసి వస్తుంది."

### కాంగ్రెస్ అనుమతి

అకాలీ దళంతో కలసి పంజాబులోని కాంగ్రెసు సిక్కులు కూడా రాజ్యాంగ పరిషత్తును పూర్తిగా బహిష్కరించారు. కాంగ్రెసు సంస్థ రాజ్యాంగ పరిషత్తులో చేరడానికే సంకల్పించింది. ఈ విషయ పరిస్థితిని గురించి అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యుడు మాస్టర్ మోతాసింగు గారు (వృద్ధసిక్కు; కాంగ్రెసు నాయకుడు) ఇలా తెలియజేస్తున్నాడు:—

"పంజాబులోని సిక్కులు ఈ విషయములో యథేచ్ఛగా నిర్ణయం చేసుకోడానికి కాంగ్రెసు అధ్యక్షుడు అధికారము ఇచ్చాడు."

మాస్టర్ మోతాసింగు బొంబాయిలో రాష్ట్రపతి నెహ్రూను కలుసుకొని ఈవిషయాన్ని ఇచ్చించాడు. పండిట్ నెహ్రూ తనకు ఇలా తెలియజేశాడట." సిక్కులకు జరిగిన అన్యాయాన్ని తొలగించడానికి కాంగ్రెసు శక్తి కొద్దీ కృషిచేస్తుంది. ఇందులో సందేహం మేమీలేదు. సిక్కులను సంతృప్తిపరచడానికి కాంగ్రెసు కార్యవర్గంచేతనైన సహాయంచేసి తీరుతుంది. మంత్రిత్రయ పథకములో సూచించిన రాష్ట్ర వర్గీకరణ కొనసాగకుండా రాజ్యాంగ రచనసమయములో కాంగ్రెసు బాధ్యత వహించి పనిచేస్తుంది. తమకు జరిగిన అన్యాయాన్ని తొలగించుకోడానికి సిక్కులు ఉద్యమం ప్రారంభిస్తామంటున్నారు. ఇట్టి ఉద్యమంలో జాతీయ సిక్కులు తమ మిగతా సోదరులతోచేరి పాల్గొంటామంటే, కాంగ్రెస్ ఏవిధంగానూ దాన్ని నిషేధించదు. ఐతే, కాంగ్రెస్ ప్రాథమిక సూత్రానికి ప్రతికూలంగా ఏదీ జరగకుండా సిక్కులు శ్రద్ధ వహించాలి..."

ఈ హామిని అనుసరించే తాము నేడు రాజ్యాంగ పరిషత్తును పూర్తిగా బహిష్కరించడానికి తీర్మానించినట్లు మాస్టర్ మోతాసింగ్ అన్నాడు. అ. అ. ప్రె.

## దక్షిణాఫ్రికా

1 వ పేజీ తరువాయి

సాగిస్తున్నందుకుమనందరంగర్వపడవచ్చు. అసలు 'సాత్వికనిరోధం' ఆసియాలోనే ప్రారంభమైంది. ఏసుక్రీస్తు ఆసియావాసే. క్రీస్తు ఇప్పుడు తిరిగి జన్మించి ఆఫ్రికాలోనే మురికిగూడాల్లోనే ఉండాల్సి వస్తుంది.

"స్మట్స్ ప్రభుత్వంలోనే భారతీయులతో రాజీకిరావడానికి నేను ఆశిస్తున్నాను. దక్షిణాఫ్రికాలోని ఈ శ్వేత దౌర్జన్యం ముగిసి అమానుష శాసనాలు రద్దు అయిపోతే ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతుల కెంటినీ సమన్వయం చేయడం సాధ్యంకాకుంటే శ్వేత నాగరికతకు దక్షిణాఫ్రికా సమాధి అవుతుంది.

## బోనసులిచ్చే గడువు ఈనెలాఖరుతో సరి

ధాన్యసేకరణ సందర్భంలో రైతులకు మణుకు ఒకటికి రూపాయి చొప్పున ప్రభుత్వం ప్రకటించిన బోనసు ఈనెలాఖరు తర్వాత ఇవ్వబడదనీ, కనుక రైతులందరూ ఈలోగానే ధాన్యం ఇచ్చివేయవలసిందనీ ప్రభుత్వంవారు ప్రకటించారు.

## లోకల్‌బోర్డుల ఎన్నికలు

లోకల్‌బోర్డుల ఎన్నికలు అక్టోబర్ మాసంలో జరుగుతాయనీ, చెన్నపట్నం కార్పొరేషన్ ఎన్నికలు ఏ సాది చివరను జరుగుతాయనీ, శాసనసభ బడ్జెట్ సమావేశంవల్ల ఇవి ఆలస్యం జరగడం లేదనీ ప్రభుత్వంవారు ప్రకటించారు.

## కప్పల తక్కెడ: సింధు రాజకీయాల స్థితి

# రాజ్యాంగ పరిషత్తులో సంస్థానాల ప్రాతినిధ్యసమస్య

## కాంగ్రెస్ వైఖరి: రాష్ట్రపతి ఉద్ఘాటన

[రాష్ట్రపతి జవాహరిలాల్ నెహ్రూ జులై 10-వ తేదీ ఉదయం బొంబాయినగర కాంగ్రెస్ భవనంలో పత్రికాప్రతినిధులతో సరిపిన 75 నిమిషాలగోష్ఠిలో వివిధవిషయాలపై వెల్లడించిన అభిప్రాయాలను అందినంత వరకూ నిన్న ప్రచురించాము. తరువాయిలాను అందినవాటిని ఇవ్వాళ ప్రచురిస్తున్నాము. ఆం. ప. సం.]

గోవాలో పోర్చుగీసు ప్రభుత్వంతో కాంగ్రెసు ప్రత్యక్ష పోరాటానికి దిగాలని ఒక విలేఖరి సూచించగా, బ్రిటిష్ఆధికారంతో పోర్చుగీసుఅధికారం కూడా పోతుంది కనుక పోరాటం సాగించవలసిన అవసరం ఉండదని తన అభిప్రాయమైనట్లు నెహ్రూ చెప్పాడు.

పుదుచ్చేరిప్రజలు భారతసమాఖ్యలో చేరితే చేరవచ్చుననీ అక్కడి ఫ్రెంచి గవర్నరు ఇటీవల చేసిన ప్రకటనను నెహ్రూ గుర్తుకు తెచ్చాడు. పుదుచ్చేరిప్రజలు భారతసమాఖ్యలో చేరేటట్లయితే తాను కూడా భారతీయపౌరుడ నవుతానని ఆ గవర్నరు అన్నాడు. భారతదేశంలో బ్రిటిషువారు కాక, ఇతర విదేశీయుల ప్రభుత్వాల ఉనికి వల్ల ఉండే చిక్కులు తుచ్ఛమైనవి మాత్రమే. ప్రతి అల్పాంశం విషయంలో నూ కాంగ్రెసు పోరాటాలనడం భావ్యం కాదు. స్థానిక ప్రజలే తమకు తోచినది చేయాలి.

### సింహళములోని భారతీయులు

సింహళంలోని భారతీయుల పరిస్థితులను గూర్చి నెహ్రూ గారు యిలా అన్నారు.

సింహళంలోని భారతీయులకు సరియైన ఓటింగు హక్కులు సరిగా లేకపోవుట మున్నగు బాధకములు చాలా కలవు. సింహళంలోని నాటక్యాటు ఎస్టేటునుంచి వందల కొలది భారతీయులను ఇప్పుడు వెడల గొట్టుటవల్ల ప్రస్తుతపు దుర్భరావస్థయొక్క తీవ్రత ఏర్పడింది. సింహళీయులు మనకు సోదరుల వంటి వారు. వారు సర్వవిధముల భారతీయ సంతతివారే కనుక వారికి చిక్కులను కల్పించవలెనని మేము కోరము. ఇటీవల సింహళ ప్రభుత్వమువారు ఆవటినుంచి భారతీయులను వెళ్లగొట్టవలెననే సంకల్పంతో పట్టుదలగా వ్యవహరిస్తున్నారు. సింహళంలో చిరకాలపురైన భారతీయులకు మాత్రమే సింహళీయులతో సమానహక్కు స్వాతంత్ర్యము లొసంగబడునని సింహళప్రభుత్వము వాదింపవచ్చును. అచట చిరకాలపురైన భారతీయులు సింహళీయులు అనిపించుకుంటారా? భారతీయులుగానే పరిగణింపబడగలరా? అనే సమస్య ఇంకా పరిష్కారం కావలసియున్నది. బర్మాలోని భారతీయుల విషయంలో కూడా ఇదే సమస్య ఏర్పడుచున్నది. అందరూ బ్రిటిష్ సామ్రాజ్యవాసులుగానే పరిగణింపబడవలెను. కాని, దక్షిణాఫ్రికాలో బ్రిటిష్ పౌర సమత్వభావం ఎట్లా వర్ధించుచున్నదో చూస్తూనే ఉన్నాము.

సింహళంలో చిరకాలంనుంచీ జీవనోపాధులు కలిగి జీవిస్తున్నవారు భారతీయులమని చెప్పుకొనకుండా, సింహళీయులమని చెప్పుకోరు. తమకు కొన్ని ప్రత్యేకసౌకర్యములు అందువల్ల లభించక పోయినప్పటికీ చెప్పుకోరు.

కాని అక్కడున్న ప్రతి భారతీయునకు ప్రాథమిక హక్కులు ఉండాలి. వారికి వోటింగుహక్కు లేనందువల్ల వారు సుమారు 30 లేదా 40 సం॥లనుంచి వారు ఆక్రమించుకొనియుండిన భూములలో నుంచి వారినితొలగించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఆ భూములలో చిరకాలంనుంచి ఉన్నటువంటివారిని అచటినుండి తొలగించేయెడల వారికి మరొక భూమిని బదిలీగా యివ్వవలెను.

లేను త్వరలోనే సింహళమునకు పోవుచున్నాను. కాంగ్రెసు వర్కింగు కమిటీవారు ఒక విచారణ సంఘమును నియమించి సింహళమునకు పంపుచున్నారు. ఈ విచారణ సంఘములోని ఇద్దరు సభ్యులు (1) ఆర్యనాయకంగారు (2) రామచంద్రన్ గారు మాత్రము నాతోకూడా సింహళం పోతున్నారు. భారతీయుల కష్టములగూర్చి సింహళ పత్రికలు ఎక్కువగా ప్రకటన చేయుట లేదు. భారతీయ పత్రికలు మాత్రము సింహళీయుల విషయమయి ఎక్కువ కటువుగా వ్రాయకుండా సౌమ్యభావంతో వ్రాయుమంనవలెనని కోరుచున్నాను.

### రాజ్యాంగ పరిషత్తులో సంస్థానాల ప్రాతినిధ్యం

రాజ్యాంగ పరిషత్తులో సంస్థానాల తరఫున సంస్థానాల ప్రజల ప్రతినిధులే పాల్గొనాలని కాంగ్రెసు ఇదివరకూ, ఇప్పుడూ కూడా అంటున్నది సంస్థానాధిపతులేమో తమ ప్రతినిధులనే పంపుతామన్నారు. మరి ఇప్పుడువారి అభిప్రాయము ఏమిటో తెలియదు. కాని, వారి వాదాన్ని మనం అంగీకరించలే మన్నది స్పష్టం. సంస్థానాధిపతుల స్థితి అటా వుండగా అసలు వచ్చిన చిక్కేమిటంటే చాలా సంస్థానాలలోని ప్రభుత్వాలు ప్రజలకు ప్రాతినిధ్యం వహించవు కనుక ఒక పద్ధతి ప్రకారం వాటిని ప్రాతినిధ్య సంస్థలుగా చేసి, అట్టి ప్రభుత్వాల ప్రతినిధులను రాజ్యాంగ పరిషత్తుకు పంపవలెన ఆవశ్యకత ఉన్నది అని నెహ్రూ అన్నాడు.

మైసూరు, హైదరాబాదు వంటి పెద్ద సంస్థానాలు యుద్ధకాలంలో ఏర్పాటుచేసిన సైన్యాలను విడిచివేయకుండా అట్లాగే ఉంచుకున్నారని నెహ్రూ దృష్టికి తేగా, ఇట్లా విడివిడిగా చిన్న చిన్న సైన్యాలు ఉంటూండడం ఎంతమాత్రం వాంఛనీయం కాదనీ, భారత సమాఖ్య ప్రభుత్వం కింద ఇవి ఇట్లా కొనసాగే పరిస్థితి ఉండదనీ నెహ్రూ అన్నాడు. కేంద్ర సైన్యం ఒక్కటే ఉంటుంది. ఈమధ్య కాలంలో ఈ సైన్యాలు కొన్ని ఇట్లాగే ఉండవచ్చు.

హైదరాబాదు విషయంలో ఆ సంస్థానపు సైన్యచరిత్రగానీ, సైనికచరిత్రగానీ ఏమంత ప్రాముఖ్యమైనదికాదు. ఒక వేళ ఏదన్నా సంఘర్షణవచ్చినా హైదరాబాదు సేనలు ఏమీచేయలేవు. అని నెహ్రూ అన్నాడు.

ఇంతకీ ఈసమస్యకు మూలాధారం బ్రిటిషు ప్రభుత్వం సంస్థానాలను అంటిపెట్టుకుని ఉండడం. ఆ అంటకాగడం పోయిందంటే సమస్యలు పూర్తిగా మారిపోతాయి. మిగతా భారతదేశానికి ప్రతికూలంగా స్థానికసైన్యం ఏదీ స్వతంత్రంగా వ్యవహరించలేదు. ఆలోచిస్తే అది అసాధ్యమైన విషయం అని కూడా నెహ్రూ అన్నాడు.

### సింధు రాజకీయాలు

ఆపైన, నెహ్రూ సింధురాజకీయాలను గురించి మాట్లాడాడు: సింధురాష్ట్రపు రాజకీయాలంతటి అవినీతికరమైన రాజకీయాలు దేశంలో మరెక్కడా లేవన్నాడు. ఇది సిగ్గుచేటయిన విషయమన్నాడు. దీని కంతటికీ సర్ గులామ్ హిదాయతుల్లాయే బాధ్యుడన్నాడు. గవర్నర్ సర్ ఫ్రాన్సిస్ ముడీకూడా ఇందుకు బాధ్యుడే ఉన్నాడనీ, వీరిద్దరినీ ఆ పదవులనుంచి ఎంత తొందరగా తొలగిస్తే అంత మేలనీ అన్నాడు.

### ప్రకాశం పంతులుగారి రాక

మద్రాసు, జూలై 10: మద్రాసు ప్రధాని శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారు బొంబాయినుంచి నేటి ఉదయం మదరాసు వచ్చారు.

## సింధు కొయలిషన్ పార్టి

### మంత్రివర్గము విూద అవిశ్వాసము

కరాచీ, జూలై 10: సింధు ఎసెంబ్లీ కొయలిషన్ పార్టీవారు సమావేశమయి లీగు మంత్రివర్గమును తొలగించ సంకల్పించినారు. రేపటిదినము ఎసెంబ్లీ సమావేశమయి కాగానే విశ్వాసరాహిత్య తీర్మానము ప్రతిపాదించదలచినారు.

రాజ్యాంగపరిషత్తుకు నల్గురు సభ్యులను ఎన్నుకొనడములో ఇంకా ఏ కార్యక్రమమునయినా సభలో చర్చకు తీసుకొనిరావచ్చునని యీ సమావేశములో నిశ్చయించినారు.

మంత్రివర్గమువారు యీ పక్షం వారి అభిప్రాయాలను ఎదిరించేట్లయితే ఆయా విషయాలనుగురించి చట్టసమ్మతమయిన పద్ధతులను న్యాయశాస్త్ర సమ్మతమయిన పద్ధతులను విచారించడానికి నలుగురితో ఒక ఉపసంఘాన్ని నియమించినారు. అవిశ్వాస తీర్మానాన్ని సభ్యులు ప్రతిపాదించడానికి అనుమతించినారు.

రాజ్యాంగపరిషత్తుకు సభ్యులను ఎన్నుకొనే పద్ధతినిగురించి కొయలిషన్ పార్టీవారు ఆలోచించినారు. పార్టీ తాలూకు తొమ్మిదిమంది ముస్లిము సభ్యులున్నా అనగా లీగుపార్టీనుంచి రాజీనామా యిచ్చివచ్చిన యిద్దరు ముస్లిము సభ్యులతో సహా ఒకమాటముగా ఏప్పుడి ముగ్గురు ముస్లిములీగు అభ్యర్థులలో ఏ ఒక్కరినయినా ఖాన్ బహదూర్ మౌలా బక్షునుకానీ, షేక్ అబ్దుల్ మజీద్‌నుకానీ నియమించాలని సంకల్పించుకొన్నారు.

### సింధులో ప్రోగ్రెసివ్ ముస్లింలీగు పార్టీ

#### షేక్ అబ్దుల్ మజీద్ అధ్యక్షుడు

కరాచీ, జూలై 10: సింధు శాసనసభలో ప్రతికూలపక్ష నాయకుడైన జి. ఎమ్. సయ్యద్‌యొక్క అనుయాయులు నేడొక ఇష్టాగోష్ఠి సమావేశంజరిపి, సింధు రాష్ట్రంలో "ప్రోగ్రెసివ్ ముస్లింలీగు" ను స్థాపించడానికి నిర్ణయించారు. ఈ పార్టీకి షేక్ అబ్దుల్ మజీద్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ముస్లింలీగు యొక్క ప్రస్తుత నాయకులు ప్రజాశ్రేయస్సుకోసం పని చేయడం లేదనీ, వారి నాయకత్వం పూర్తిగా నిష్ప్రయోజనమనీ, ప్రోగ్రెసివ్ ముస్లింలీగు పార్టీ వారి వాదం. అనతికాలంలో పెషావర్ వద్దనూ, హైదరాబాదు వద్దనూ పార్టీ సమావేశాలు జరప దలచారు.

## చెన్నపురికి డా॥ పట్టాభిగారి ఆగమనం

### "ఏ ఐ సి సి వ్యవహార సరళిలో జరిగింది

మద్రాసు, జూలై 11: డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు బొంబాయినుంచి విమానంలో ఈ ఉదయం 7-30 గం. బయలుదేరి మధ్యాహ్నం 1-15 గం. మద్రాసు చేరారు. ఈ నెల 15 తేదీవరకూ ఇక్కడ వుంటారు. ఈలోపుగా వారు రాజ్యాంగ పరిషత్తుకు తమ నామినేషన్ దాఖలుచేస్తారు.

మీరు హాజరైన ఏ. ఐ. సి. సి. సమావేశాలన్నింటిలోనూ మొన్నటి బొంబాయి సమావేశం అతి నిరుత్సాహమైనదిగా కనబడలేదా అని ఆంధ్రపత్రిక విలేఖరి ప్రశ్నించగా డా॥ పట్టాభిగారు ఇలా సమాధానం చెప్పారు.

"నేను అనుకోవడంలేదు. ఇది కేవలం వ్యవహారసరళిలో జరిగిన సమావేశం. ఇది వరకు జరిగిన సమావేశాలలో మాదిరిగా ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలేవీ లేకపోవటం నిజమే. ఇదివరకు జరిగిన సమావేశాలకు వేలకొద్దీ ప్రేక్షకులువచ్చి హర్షధ్వానాలు చేస్తుండేవాళ్లు. అందువల్ల ఆ సమావేశాలు అతి ఉత్సాహభరితమైనవిగా కనబడుతుండేవి.

కాంగ్రెస్ సంస్థ స్వయం పరిపూర్ణతను పొందుచున్న సంఘంవారి లక్షణంగానే ఈ సమావేశం ఉద్ధతిలో జరిగింది.

ఈ సభలో జరిగిన కార్యక్రమం సంతృప్తికరంగా, సవ్యంగా పద్ధతిగా జరిగిపోయిందనే చెప్పవలసి వుంటుంది."

## రామచంద్రపురం తాలూకాలో మలబారు పథకం

మలబారులో వలె ధాన్య సేకరణా, పంపిణీ, అమ్మకం సహకారసంఘాల ద్వారా జరిగే ఏర్పాటును ప్రభుత్వంవారు రామచంద్రపురం తాలూకాలో కూడా అమలుచేయబోతున్నారు. శ్రీయుతులు వడ్లమూడి సత్యనారాయణ, బిక్కిన వెంకటరత్నంగార్లు ఆహార శాఖ కార్యదర్శి పి. వి. సుబ్బారావుగారిని కలుసుకొని రామచంద్రపురం, తాళ్లరేవు, ఆలమూరులలోని సహకారసంఘాలు ఈ పనిని నిర్వహించడానికి సంసిద్ధంగా ఉన్నాయని తెలుపగా, వారు పైవిషయం ప్రకటించారు.

## పనికి పోవటానికే భయపడేవాడు

### చేతులనొప్పికి అతడు తాళుకోలేక పోయేవాడు

### అయితే క్రుష్చెన్ అతన్ని చక్కపరచింది

చేతులు కీళ్లవాతంవల్ల అతడు యమ యాతనపడ్డాడు. పనికి పోవటానికే భయపడే వాడు. అటువంటివాడు యీ రోజున పనంటే బహు వుత్సాహంగా వున్నాడు. అతని జాబు చూడండి:—

"నేను కీళ్లవాతంతో బాగా బాధపడ్డాను" అని అతడు వ్రాస్తున్నాడు. "కీళ్ళనొప్పి బాధ వల్ల భరించలేక పోయేవాణ్ణి. పనిలో ప్రవేశించటానికే భయం వేసేది. రెండు మందులు వాడి చూచాను. ఈ కీళ్ళనొప్పు లకు ఏమి లాభంలేకుండా పోయింది."

"క్రుష్చెన్ సాల్ట్సు వాడి చూడమని కొందరు సలహా యిచ్చారు. ఒక సీసా వాడేటప్పటికి గుణం కనిపించింది. దాన్ని విడవక వాడుతూ వచ్చాను. ఇపుడు పని చేయవలెనంటే బహు వుత్సాహంగావుంది."

—ఎస్. బి.

కండరములలోను కీళ్లలోను యూరిక్ ... వల్ల కీళ్లనొప్పులు ... క్రుష్చెన్ సాల్ట్సు ... మూత్రపిండాలను ... ఆ పనిచేస్తుంది.

క్రుష్చెన్ సాల్ట్సు కొన్ని కెమిస్టు లందరి వద్దను స్టోర్సులందును కొనవచ్చును.





## రాజమండ్రి టైలర్స్ యూనియన్

### తృతీయ వార్షికోత్సవం

రాజమండ్రి, జూలై 9: రాజమండ్రి టైలర్స్ యూనియన్ తృతీయ వార్షికోత్సవ మహాసభ మొన్న 7-వ తేదీనాడు విక్రమహాలుకు ఎదురుగానున్న పోలీసు మైదానంలో బి. యస్. మల్లికార్జునరావు (యం. యల్. ఏ.)గారి అధ్యక్షత క్రింద జయప్రదంగా జరిగింది. 'శ్రమజీవి' పత్రికా సంపాదకులైన చిలకమర్రి సత్యనారాయణాచార్యులుగారు మాట్లాడుచు సమిష్టి ఉత్పత్తి కేంద్రములిందు స్థాపనములను నెల కొల్పమనీ, పనిలో నిపుణతగలవారిని తయారుచేయుటకు పాఠశాలలు పెట్టించమనీ సభ్యులను కోరిరి.

నెలకు కనీసము నాలుగు పిడుల దాన మైనను ఇప్పించమనియు, బొత్తాములు, సూదులు వగైరా వస్తువులను తమ సంఘం కొట్టుకు ... ఇప్పించమనియు అధికారులను కోరుచు సభవారు తీర్మానించిరి.

## రేషనింగు రూలు అతిక్రమణకు శిక్ష

చీరాల, జూలై 8: కాఫీహోటళ్లలో బియ్యంతో ఇడ్లీలుచేయగూడదని రేషనింగు ఆఫీసరు ఉత్తరువులు జారీచేసిఉండిన్ని ఇక్కడ ఒక అయ్యరు హోటలులో మొన్నటి దినం బియ్యపు ఇడ్లీలు తయారు చే నందున రేషనింగు ఆఫీసరు ఆ హోటలు యజమానికి ప్రథమ నేరం క్రింద 10 రూపాయల జరిమానా విధించిరి.

## బండిపట్టాల బ్లాకు మార్కెట్టు బట్టబయలు

చీరాల, జూలై 8: ఈ ఊర్లో ఒక ఇనుపకొట్టులో బండిపట్టాలు బ్లాకు మార్కెట్టులో అమ్ముతున్నారని తెలిసి చీరాల పోలీసు సబ్ ఇన్స్పెక్టరు వెళ్లి ఆ కొట్టును సోదాచేసిరి. కాని, అక్కడ ఏమీ చిక్కలేదు. మరికొంత పట్టుదలగా ఈ వర్తకుడే బ్లాకుమార్కెట్టులో అమ్మడానికి కారంచేడులో 7 జతల బండి పట్టాలు నిలవచేసినట్లు తెలియవచ్చింది. వెంటనే అక్కడికి వెళ్లి ఆ 7 జతల బండి పట్టాలను పట్టుకొన్నారు. పోలీసులు ఈ విషయమై ఇంకా దర్యాప్తు చేస్తున్నారు.

## 3000 రూ. బెల్లం పట్టుబడుట

రాయదుర్గం, జూలై 7; నిన్నటిదినం గొల్లపల్లె గ్రామంనుండి సరిహద్దు మైసూరు ప్రాంతానికి 91 మూటల బెల్లం సుమారు 3000 రూ. కిమ్మతుచేసేది. దొంగతనంగా కొందరు రవాణా చేస్తూవుంటే ఈ వూరి సబ్ ఇన్‌స్పెక్టర్ ఏ. వి. వేణుగోపాల రావుగారు, హెడ్ కానిస్టేబిలులూ పట్టుకొని స్థానిక సబ్ మేజస్ట్రేటుగారి యెదుట హాజరుచేసిరి.

### సంస్కృతపాఠశాలకు 2000 రూ. విరాళం

నెల్లూరు, జూలై 8: కీ. శే. సుండ్లపూడి నరసింహయ్యగారు వారి వీలునామాలో వ్రాసిపెట్టిపోయిన ప్రకారం ఆయన భార్య వెంకటసుబ్బమ్మగారు మూలపేట సంస్కృత పాఠశాలకుగాను 2000 రూ. విరాళాన్ని సదరు పాఠశాల కార్యదర్శి యైన కొసుకెల రామారావుగారికి నిన్నటి దినం అందజేసిరి.

### మొక్కజొన్నలు రేషను

మదరాసు, జులయి 10: ఈ నెలలోను వచ్చేనెలలోను అమెరికానుండి 31 వేల టన్నులు, ఈజిప్టునుండి 7 వేల టన్నులు మొక్కజొన్నలు మన రాష్ట్రము నకు రానున్నవి. తగ్గిపోయిన 2 ఔన్సుల బియ్యం రేషనుకి బదులు దీన్ని యిచ్చుటకు ప్రభుత్వంవారు యోచిస్తున్నారు. చన్నరాష్ట్రం వంతుకి వచ్చే మొక్కజొన్నలు యితర రాష్ట్రాలకుపంపి యీ రాష్ట్రానికి బియ్యం యిమ్మని మదరాసు ప్రభుత్వంవారు కేంద్రప్రభుత్వానికి సూచించిరి. మొక్కజొన్న వాడుకగూర్చి ప్రచారంకూడ చేయనున్నారు.

### మదరాసు ప్రధాని నివాసం

శ్రీ. టి. ప్రకాశం పంతులు ప్రధాని గారు, తమ నివాసమును 8, రాజావీధి త్యాగరాయనగరంనుండి, మవుంటురోడ్డు ప్రభుత్వమందిరమున "కూవము హౌసు" నకు మార్చిరి. టెలిఫోనునెంబరు 8896.

శ్రీ టి. ప్రకాశంగారు, లూయిఫిషరుని చెన్నరాష్ట్రంవచ్చి తమ గ్రామ పునరుద్ధరణ స్కీములు, మున్నగునవి పరిశీలింప ఆహ్వానించిరి.

### కార్పొరేషన్ బడ్జటు

మదరాసు కార్పొరేషను వచ్చేయేంటికి బడ్జటు ఆమోదించుచు, మదరాసుప్రభుత్వంవారు ఆస్తిపన్నులో 12% వంతుకాక 8% వంతు మాత్రమే విద్యకై వసూలు చేయాలని సూచించిరి.

## దక్షిణభారతదేశ ఆదిమవాసుల మహాసభ

### నెల్లూర్లో అయ్యప్పన్‌గారి అధ్యక్షతను సమావేశం

నెల్లూరు, జూలై 8: ప్రథమ దక్షిణ భారత ఆదిమవాసి సేవాసభ ఇక్కడికి 6 మైళ్ల దూరంలో ఉన్న పల్లెపాడు ఆశ్రమంలో శ్రీ॥ అయ్యప్పన్ గారి అధ్యక్షత క్రింద నిన్నటిదినం జయప్రదంగా జరిగింది. సభాధ్యక్ష స్థానపరులైన ఆచార్య పి. సి. గిడ్డిగారు మొట్టమొదట మాట్లాడుతూ ఈ సభయొక్క ఆవశ్యకతను, ఉద్దేశ్యాలను తెలియజెప్పిరి. ఆదిమవాసుల ఉద్ధరణకు బొంబయి, ఢిల్లీ, మాంగా, ఛా ర్వడ్, గుజరాతు మొదలైన చోట్ల ప్రత్యేక సంఘాలున్నవనీ, అటువంటిది దక్షిణ భారత దేశంలో లేని లోటు తీర్చడానికే ఈ నాడు ఈసంఘం స్థాపింపబడినదనీ చెప్పిరి.

తరువాత మద్రాసు ప్రభుత్వ న్యాయ శాఖామంత్రి భాష్యంగారు సభా ప్రారంభం గావిస్తూ ఇట్లుపన్యసించిరి:

"ఆదిమవాసులైన మీ స్థితిని బాగుపరచటం చాలా అత్యవసరం. ఆదిమ వాసులని ప్రస్తుతం చెప్పబడే మీరు ఒకానొక ప్పుడు ప్రభువులు. ఆ విషయం మరచిపోకండి. మీలో కొందరిని దొంగజాతులని పిలవటం పొరబాటు. ఈజిల్లాలోనివారి స్థితి నాకు తెలియదు గాని మధుర, రామనాడుజిల్లాల్లో 'దొంగజాతు' లని పిలువ బడేవారిస్థితి చాలా ఘోరంగా ఉన్నది. నేనిప్పుడు వాగ్దానమేమీ చేయలేను గాని దొంగజాతుల చట్టం విషయంలోను, అలవాటుపడిన నేరస్థుల చట్టానికి సంబంధించిన్ని కొన్నిమార్పులు రాగలవని, ఆశిస్తున్నాను. వెనుకబడియున్న జాతుల అభివృద్ధికై చాలా పెద్దమొత్తాన్ని మద్రాసు ప్రభుత్వంవారు ప్రత్యేకించిపెట్టియున్నారని మీకు తెలియజేయడం రహస్యం బయటపెట్టడమేమీ కానేరదు. మీ అభివృద్ధికొరకు నేనేమేమి చేయవలసి వుంటుందో అదంతా నా సహమంత్రులతో ఆలోచించి తప్పక చేయగలనని నమ్ముతున్నాను."

తరువాత సభాధ్యక్షత వహించిన అయ్యప్పన్ గారు (మద్రాసు మ్యూజియం సూపరింటెండెంటు) మాట్లాడుతూ ఇలా ఉపోద్ఘాటించారు:

"ఆదిమవాసుల ప్రస్తుత దౌర్భాగ్య స్థితికి హిందూసంఘీయులమైన మనమే కొంతవరకు కారణం. వెంటనే వీరికి అనుకూలమైన కొన్ని కార్యాలు చేయడం మన ధర్మం. వీరికి తగినవిద్య నేర్పించాలి. వీరి ఆర్థిక పరిస్థితులను బాగుపరచాలి. అందుకుగాను వీరికి భూవసతి కల్పించడం ముఖ్యం. కేంద్రప్రభుత్వంవారి యాజమాన్యాన భారతదేశం లోని అన్నిరాష్ట్రాలలోనూ, అన్నిసంస్థానాలలోనూ ఆదిమవాసులకు సంబంధించి త్వరలో ఒక సమావేశం జరపడం చాలా బాగుంటుంది. ఇప్పుడు ఏర్పడబోయే రాజ్యాంగనిర్ణయసభలో ఆదిమవాసులకు ప్రాతినిధ్యం ఉండాలి."

అటుపిమ్మట హైదరాబాదు సంస్థానంలోని ఆదిమవాసుల అభివృద్ధికొరకై ఏర్పడియున్న ప్రభుత్వడిపార్టుమెంటు సలహాదారుడైన డాక్టరు హేమండ్ డార్ఫ్ గారు మాట్లాడుతూ ఆ సంస్థానంలో జరుగుచున్న ఆదిమవాసి అభివృద్ధి కార్యక్రమాన్నిగురించి ముచ్చటించిరి. వారికై లిపులు తయారుచేయడం, వారికి చదువు చెప్పించడం, వృత్తులు నేర్పించడం—ఇవన్నీ వారి కార్యక్రమంలో ఉన్నవని వారు చెప్పిరి.

## ఆంధ్రమహాసభ అధ్యక్ష పదవి

జైపూరు, జూలై 6: ఆంధ్రమహాసభ అధ్యక్షపదవికి సర్ విజయానంద కుమారు గారు రాజీనామా నిచ్చినందున వారిస్థానే ఆంధ్రదేశంలో చాలకాలం రాజ్యాంగములందు పాల్గొనిన బొబ్బిలిరాజా సాహెబ్ గారిని ఎన్నుకోవడ ముచితమని ప్రముఖ ఆంధ్రులకు ఆంధ్రమహాసభా కార్యవర్గ సమితికి జయపూరులోని కోరాపుటు జిల్లా ఆంధ్రసంఘమువారు తంతి నంపారు.

స్వ. వి.

### మదరాసు కార్పొరేషను

మదరాసు, జూలయి 10:— మద్రాస్ కార్పొరేషను సభయందు, నిన్ను కుప్ప పనివారి సమ్మెనుగురించి కమిషనరు సూచన చర్చకువచ్చెను. కుప్పపని వారు యింట్లో అందరు పనిచేయుచుందురు కనుక నెలకు రూ 100 లు సంపాదిస్తారు. గ్రాట్యుయేటు రాబడికన్న యిదియెక్కువే. కరువుభత్యాలు ప్రభుత్వంవారు యిచ్చినదానికన్న ఎక్కువ యివ్వవీలులేదు. మదరాసు కార్పొరేషను యిస్తున్న జీతాలు చాల ఉదారముగ నున్నవి. ఈ కార్మికుల కోర్కెలు చాల అన్యాయంగా నున్నవి. బకింగ్‌హాంమిల్సు పనివారికై రూ 1 లక్ష కౌన్సిలువారు యిచ్చినందున కుప్పపనివారు ఎక్కువగ అడుగుచున్నారని, కమిషనరు గారు తెలిపిరి. ఈ విషయం వచ్చే సోమవారం చర్చించుటకు అంగీకరించబడెను.

## స్పెన్సరు కంపెని పనివాళ్ల సమ్మె

### పరిష్కర్తతీర్పు

### పనివారినందరిని చేర్చుకొని లేనివారికి బోనసు

మదరాసు, జూలై 10: స్పెన్సరు కంపెనీ పనివారు సుమారు 700 మంది ఏప్రిలు 12 నుండి సమ్మె కట్టియున్నారు. వారికి యజమానులకు గల తగవు పరిష్కరించుటకు ప్రభుత్వంవారు నియమించిన ఏ టీ ఏ వి లు కోర్టు ప్రిన్సిపలు జడ్జి పి. మాణిక్కం డేయలుగారు తమ తీర్పును ప్రభుత్వంవారి కందజేసిరి. సమ్మెకట్టిన పనివారందరిని పూర్వం జీతాలు సర్వీసులతో సూడ నెలరోజులలోగా పనిలో చేర్చుకొనవలెను. సమ్మె జరిగిన కాలంలో జీతంకాని, కరవుభత్యంకాని యివ్వనక్కరలేదు. కాని యితర సర్వీసు సౌకర్యాలకు ఆకాలంలో కూడ పనిలో నున్నట్లే యగును. తిరిగి పనిలో చేర్చుకొనబడని పనివారుంటే, వారికి సమ్మె ప్రారంభమయిన నాటినుండి నేటివరకు జీతం కరువుభత్యం యివ్వాలి. 31-12-44 నుండి పనిలో నుండిన పనివారందరికి 2 నెలల జీతం బోనసుగా యివ్వాలి. అని జడ్జిగారు అవార్డు యిచ్చిరి.

## అంతోనిపిళ్లై అరెస్టు

### సభ చేసినందుకు

మదరాసు, జూలై 10: బకింగుహాం కర్నాటకమిల్సు సమ్మె సందర్భమున జులయి 1-వ తేదీన అనుమతిలేనిది సభ జరిపినందుకు మదరాసు లేబరుయూనియను అధ్యక్షుడగు అంతోనిపిళ్లైగారిని నిన్న సాయంకాలం పోలీసువారు అరెస్టుచేసిరి. నేడు ముగ్గురుపనివారు, దారి అడ్డినందుకు అరెస్టుచేయబడిరి.

### ఉద్యోగుల మార్పులు

బి. వెంకటరత్నం నాయుడుగారు, విశాఖపట్నం తాసీల్దారు ఆ జిల్లాలోనే రా. సా., కృష్ణరావునాయుడుగారి శెలవులో డిప్టీ కలక్టరుగ నియమింపబడిరి. కృష్ణరావుగారు 3 వారాల సెలవయినాక, శ్రీకాకుళం డిప్టీ కలక్టరుగ నియమింపబడిరి.

ఎస్. విరూపాక్ష చెట్టిగారు, సివిలు సప్లయిసు డిప్టీ కమిషనరుగా (ఉత్తరం) నియమించ బడిరి.

ఎం సూర్యప్రకాశరావుగారు, తూ. గోదావరి తాసీల్దారు ఆ జిల్లాలోనే డిప్టీ కలక్టరుగ నియమింపబడిరి.

బి. ఎన్. సుబ్బన్న ఆచార్యగారు, వ్యవసాయశాఖ డిప్టీ డైరక్టరుగ నియమింపబడిరి.

పి. వి. చలపతి మదలిగారు విశాఖపట్నం జిల్లా కలక్టరువద్ద 2 వ పెర్సనలు అసిస్టెంటుగను, పి. రామచంద్రపంతులు గారు విజయనగరం దివానుగను, ఎస్. రాఘవులునాయుడుగారు గుంటూరు టి. డి. సి. గను, రా. బ, పి వి. కృష్ణరావుగారు శ్రీకాకుళానికి, ఎ. లక్ష్మీరు సాహేబుగారు తూ, గోదావరికి, పి, రామకృష్ణరావు గారు గుంటూరుకు డిప్టీకలక్టరులు మార్చబడిరి.

## మదరాసు ధరలు

మదరాసు, జూలై 10:

వేరుసెనగ: (581పా॥ 1-కి ఎక్సు కోస్టా గిడ్డంగులు) శ్రోత్రకం మెషిన్ పప్పు మదరాసు జల తీరలేదు. ఇంగ్లీషు కాండి (500 పౌను గలది) 1-కి చెక్కరకంస్టాకు లేదు. ఎక్సుపెల్లర్ (సేల్సు టాక్సుతో సహా) మదరాసు, ఆఫీసునూనెధర తీరలేదు. బెంకాయ నూనె 38 పౌనుగల డబ్బా స్టాకు లేదు. ఆముదము మిల్ డెలివరి ఎక్సుపెల్లరు పర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది 270-0-0చ కరరహాసపేట 54-10-3 కొన్నూర్ 52-13-0, 53-2 0, ఉలయ్యారు 54-1-3.

బంగారు వెండి: నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1 కి ఎవ్వర్ను బొమ్మ వెల 64-0-0 పెట్టాబంగారు తులం 91-0-0 మూసబంగారు 90-0-0 సీమ వెండి తులము 100 కి (రెడీ) 161-0-0 తులం వెండి 1 కి 1-10-0.

## న్యూయార్కు దూది మార్కెటు

న్యూయార్కు, జూలై 10:

న్యూయార్కు దూది: జూలై 33.53/33.53 అక్టోబరు 33.59/33.62 డిసంబరు 33.75/33.75 జనవరి 33.76/33.76 మార్చి 33 73/33.73 మే 33.64 / 33.64 జూలై 33.35/33.35 అక్టోబరు 32.20/32.20 డిసంబరు 32.11/32.11.

| | |
|---|---|
| మిడ్లింగ్ హాజరు | 34.19 |
| జూలై (గరిష్ఠధర) | 33.62 |
| (కనిష్ఠధర) | 32.90 |

### జూలై వాయిదా ధరలు

| | |
|---|---|
| నేటి ప్రారంభం వెల | 32.90 |
| నిన్న | 32 44 |
| నేటి ముగింపు వెల | 33,59 |
| నిన్న | 32 62 |









Printed, & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras